వ. తలపోసి దినదిన ప్రవర్ధమాన తనయా తనుగ్లానికత్యంత దుఃఖితుండై
తత్కారణం బెఱుంగక వలదని మౌగ్ధ్యంబున వారించి చూచి యంతకంత కగ్గలం
బగుడు గుడికిం జని పూజాంతిమ నమస్కరణానంతరంబునఁ, దన మనోనిర్వేదనం
బన్నగరివెన్నునకు విన్నపింపం బునర్నమస్కృతిఁ జేసి, "దేవా దేవదాసి యగు
మదీయపుత్త్రి యేమిగుఱించియో విచిత్రంబగు వ్రతచర్యం గాత్రశోషంబు సేయు
చున్నది, వల దన్న విన, దపుత్త్రకుండ నగునాకుఁ బుత్త్రియైనను బుత్త్రకుండైనను
దాన, యే నేమిసేయుదు! మఱి తన తపశ్చర్య యెఱుంగు మా తపశ్చర్య యెఱుంగు
గాదు, ఏము భవద్దివస భవజ్జనిదివస రాత్రులం దక్క గణరాత్రజాగరంబు లెఱుం
గ, మేము బిసబీజాక్ష వలయంబులు దక్క బిసవలయంబు లెఱుంగ, మేము ప్రసాద
కుసుమంబుఁ జెవిఁజెరువుటఁ దక్క నవి గప్పుకొన నంటు శయనింప నెఱుంగ మేము
చెంబుల భవత్తీర్థంబు గ్రోలినఁ దా నంగంబులు వడిపికొను, మేము చాంద్రాయణం
బులఁ జంద్రవృద్ధి జడిఁ గడిమొక్కించినఁ దా నంచు, మేము నిదిధ్యాస నిశ్వాస నిరో
ధంబు సేసినం దాఁ దద్ధ్యానవశ వెలికి నిగిడించు, మేము చిన్ముద్రకై హృదయంబునం
గేలు సేర్చినం దాఁ గపోలంబునం జేర్చు, వల్కలోత్తరీయంబు లేము వహించినం
దాఁ గిసలయోత్తరీయంబులు వహించు, మేము సితపక్ష నూత్నేందుఁ గీర్తించినం
దాఁ బూర్ణేందు నుపాలంభించు; నిట్లుగాఁ బ్రవర్తిల్లుచున్న యది; యిది యేటితపం
బున్మాదంబు గానోపు, నెంత భవదీయభక్తి గలిగిన మాదృశులకుఁ బ్రకృతి సంబం
ధంబు విడువ; దెంతర్యామివి నీ వెఱుంగని యది లేదు; దీని నెఱంగ నెఱింగింపవే;"
యనవుడు, ననుకంపాతిశయంబున నవ్వ్యాపనంబునకు మందస్మితంబు సేసి మందర
ధరుం డిట్లనియె. 157

తనయా తను గ్లానికిఁ = కూఁతుయొక్క దేహాయాసమునకు, మౌగ్ధ్యంబునఁ = తెలియనివాఁ
డయినందున, ...అగ్గలంబు = అధికము, అగుడుఁ = కాఁగా, గాత్రశోషంబు = దేహము నెండఁ
గొట్టుట, భవద్దివస=మీదినము (అనఁగా హరివాసరము)_భవజ్జనిదివస=నీ జన్మ దినములయొక్కయు;
గణరాత్రము=పెక్కు రాత్రులు, చాంద్రాయణంబు=చంద్రవృద్ధిక్షయంబులంబట్టి కడిని పెంచ్చిం
చుచు తగ్గించుచు చేయు వ్రతము, నిదిధ్యాసఁ = బ్రహ్మధ్యానమందు, చిన్ముద్ర = జ్ఞానముద్ర;
వల్కల=నార, కిసలయ=లేఁతయాకు, సితపక్ష=శుక్లపక్షమందలి-నూత్నేందుఁ = క్రొత్తచంద్రుని,
ఉన్మాదంబు=పిచ్చి, అనుకంపా=కనికరము, మందరధరుండు=నారాయణుఁడు.

—* ఆశ్వాసాంతము *—

ఉ. కంధర నీలవర్ణ, మధుకైటభ నాగ సుపర్ణ, యోగిహృ
 ద్గ్రంథిభిదోత్థ భోగివనితా స్వనవ చ్ఛ్వసన ప్రవ చ్ఛిర
 స్సంధి వసన్ని శాపతి వస స్రుతి దుగ్ధపయోధి వీచికా
 మంథర కేళికాదర సమాశ్రిత పంక్తిశిరోధిసోదరా. 158

కం...ర్ణ - కంధర=మేఘమువలె - నీల=నల్లనైన - వర్ణ = దేహచ్ఛాయకలవాఁడా (ఉపమ). మధు...ర్ణ - మధు =మధుఁడు-కైటభ = కైటభుఁడు - అనెడు - నాగ = పాములకు - సుపర్ణ = గరుడుఁడవైనవాఁడా (రూపకము), యో...ర - యోగి=హఠయోగము లంబికాయోగము రాజయోగము గల తపస్వులయొక్క - హృత్ గ్రంథి=హృదయంపుముడియొక్క - భిదా = భేదనముచేత - ఉత్థ = హృచ్చక్రముపైకిలేచిన - భోగి వనితా = ఆడుఁబాము నాకారమున నుండెడి కుండలినీ శక్తియొక్క - స్వనవత్ =ధ్వనిగలదైన - శ్వసన=ఊర్పుచేత - స్రవత్ =ఓడుచున్న - శిరస్సంధి - శిరస్సులోని బ్రహ్మరంధ్రమందు - వసత్ =ఉన్నట్టి - నిశాపతి రస=అమృతముయొక్క - స్రుతి=ప్రవాహమనెడి - దుగ్ధపయోధి=పాలసముద్రముయొక్క - (రూపకము) - వీచికా=అలలయందు-అమంథర=అలసముకాని - కేళికా=క్రీడయందు-ఆదర=ప్రీతికలవాఁడా, సమా...రా - సమాశ్రిత=శరణుఁజొచ్చినవాఁడైన - పంక్తిశిరోధి సోదరా=దశకంఠుని సహోదరుఁడుకలవాఁడా.

తా.—నారాయణమూర్తి నీలమేఘశ్యాముఁడు, గరుడుఁడు పాములను చంపునట్లుగా మధుకైటభులనెడియసురలను చంపినవాఁడు, [కల్పాంతమున నారాయణుఁడు యోగనిద్రలోనుండఁగా వారు అతనిచెవులనుండి పొడమి తన్నాభికమలమునుండి పొడమియున్న బ్రహ్మను బాధింపఁ దొడంగిరి. అతనిమొఱ్ఱకు మేల్కొని నారాయణుఁడు వారిని సంహరించెను.] యోగి నాభియందలి మణిపూర చక్రమందు నాగాంగనారూపమున నిద్రించుచుండెడి కుండలినీశక్తి యోగవిశేషముచేత మేల్కొని లేచి హృదయగ్రంథిని భేదించుకొని యోగి శిరస్సునందలిసహస్రారకమలముం బొడుచును; అందుండి అమృతము దుగ్ధపయోధివలె నుప్పతిల్లును; అందు శ్రీమన్నారాయణుఁడు క్రీడాసక్తుండైయుండును; రామావతారమైన నారాయణమూర్తిని రావణునితమ్ముఁడు విభీషణుఁడు శరణుఁజొచ్చినాఁడు, అట్టి యా నారాయణుఁడవే అగునో వేంకటేశ్వరా, అని సంబుద్ధి; దీనికి 'అవధరింపుము' 6 (2) అనుక్రియతో నన్వయము.

ఇందు ర్ధ ర్థ లకు ప్రాస మున్నది; అప్పకవి దీనిని అంగీకరించి స్వవర్గజప్రాస మని పేర్కొని, ప్రాసములో అంధక, బాంధవ, గ్రంథి, అంధులు అను పదములుగల పద్యమును భారతమునుండి ప్రమాణీకరించినాఁడు.

క. ప్రపదానిశ నతిచర్యా, । త్రిపదావనవర్య, నాకదేవాద్యమర
ద్విప, దానవాహితోదిత । విపులాత్మభవా, భవారివిశ్రుతనామా. 159

ప్రప...ద్విప-ప్రపద=పాదాగ్రములకు - అనిశ=ఎల్లప్పుడును - నతి=మ్రొక్కుట యొక్క-చర్యా=చేఁతచేత-త్రిపద=స్వర్గమర్త్యపాతాళములనెడి మూఁడుస్థానములందును - అవన=జీవించువారిలో-వర్య=ముఖ్యులయిన-నాకదేవ=స్వర్గపతియైన యింద్రుఁడు - ఆది=లోనుగాఁ గల-అమర ద్విప = సురోత్తములు కలవాఁడా (ఉపమ), దాన...పా - దానవ =అసురులకై - అహిత = చేటునకై - ఉదిత=జనించిన - విపులా-ఆత్మభవా=భూపుత్త్రి గలవాఁడా, భవా...మా - భవ=సంసారమునకు-అరి=శత్రువైన-విశ్రుత=ప్రఖ్యాతమయిన-నామా=పేరుగలవాఁడా.

తా.—శ్రీమన్నారాయణుని పాదాగ్రములకు అనిశము మ్రొక్కుచుండుటచేత నింద్రాద్యమరవరులు మూఁడులోకములలోను ఉత్తములై యున్నారు. (మహాలక్ష్మి) రామావతారమందు నారాయణునికి భార్యగా (సీతాదేవిగా) అసురవినాశకారణార్థము జనించినది. నారాయణ నామోచ్చారణచేత జననమరణ ప్రవాహము తప్పిపోవును. అట్టి నారాయణుఁడవైనయో వేంకటాచలపతీ, అని సంబుద్ధి - 'అవధరింపుము' 6 (2) అని యన్వయము.

## తోటక వృత్తము.

ద్రుహిణాండకరండక ధూర్వహగ। ర్భ, హరార్భక దుర్భర పక్వతపః
కుహనార్భక, వార్భృత కోనిరి హా। రి హిరణ్మయ హర్మ్య చరిష్ణుపదా. 160

ద్రు...హ - కరండక = కరవటములవంటి - ద్రుహిణ అండ = బ్రహ్మాండముల యొక్క - ధూః = భారమును - వహ = మోచునదైన - గర్భ = కడుపుకలవాఁడా, హరా...క - హర=శివుని - అర్భక = కుమారుఁడైన కుమారస్వామియొక్క - దుర్భర = భరింపశక్యముగాని - పక్వతపః = (తపః ఫలమయిన) - కుహనా అర్భక = కపటబాలుఁడా, వా...దా - వాః = నీళ్లతో - భృత = నిండిన - కోనిరి = స్వామికోనే రను నాంధ్రనామముగల స్వామిపుష్కరిణియందు - హారి = మనోహరమయిన - హిరణ్మయ - కనకవికారమయిన - హర్మ్య = సౌధమందు - చరిష్ణు = సంచరించెడు - పదా = చరణములు కలవాఁడా.

తా.—నారాయణుని గర్భమందు కరవటమువంటి బ్రహ్మాండములు లెక్కకు మీఱియున్నవి. వానిభారము నెల్ల ఆయన ఆ కడుపులో మోచుచున్నాఁడు. కుమారస్వామి చేసినతపస్సునకు ఫలముగా నారాయణుఁడు బాలుఁడుగా జనించినాఁడు. జలసమృద్ధమై మనోహరమైన స్వామి పుష్కరిణియందలి సౌధములోనికి నారాయణుఁడు వేంకటాచలపతిగా వేంచేయును. అట్టి యో వేంకటాచలపతీ - 'అవధరింపుము.' 6 (2) అని యన్వయము.

మ. ఇది యంధ్రోక్తియథార్థనామ యవనాసృక్పూర్ణ కెంబావి వా
రిద పద్ధ త్యవరోధి వప్రవలయ శ్రేణీవిఘాతక్రియా
స్పద సేనాగ్రగ కృష్ణరాయ మహిభృ త్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృ ద్యంబైన పద్యంబులన్. 161

ఇది = ఈ = ఈ గ్రంథభాగము, ఆంధ్ర...దన్ - ఆంధ్ర ఉక్తి = తెనుఁగుమాటచేత - యథార్థనామ = సార్థకనామమై - (కెంబావి తెనుఁగుమాటగా విడఁదివిచికొన్నచో - కెంపుబావి - ఎఱ్ఱనిబావి = రక్తవాపి అనియర్థ మగును. - అంగులకు ఉపపత్తి అనంతరవిశేషణమున నున్నది). - యవన=తురకలయొక్క - అసృక్=రక్తముతో - పూర్ణ=నిండినదైన - కెంబావి = కెంబావిపట్టణముయొక్క - వారిద=మేఘములయొక్క - పద్ధతి=దారిని - అవరోధి=అడ్డగించునట్టి - వప్రవలయ=చుట్టుకోటలయొక్క - శ్రేణి=వరుసయొక్క - విఘాతక్రియా = పడఁగొట్టు పనికి - ఆస్పద=నెలవయిన - సేనా=దండునకు - అగ్రగ=ముందు నడచువాఁడయిన - కృష్ణరాయమహీభృత్ సంజ్ఞ = కృష్ణరాయ పృథివీపతి యను పేరి - అస్మత్ = నాయొక్క - ఆముక్తమాల్యదన్ =ఆముక్తమాల్యద (యను కావ్యమున) యందు, పంచమంబు=ఐదవదైన - ఆశ్వాసము=కావ్యవిభాగము, హృద్యంబైనపద్యంబులన్ = మనోహరము లగుపద్యములతో, అమరున్ =ఒప్పును.—నిరుక్త్యలంకారము, అతిశయోక్తియు.

"యోగము చే నామములకు। బాగుగ నన్యార్థకల్పి పరఁగు నిరుక్తిన్;
ఈగతి వేఁపుదు వీవు వి। యోగుల దోషాకరాఖ్య యొప్పదె నీకున్ ?" అను.

వారిద పద్ధత్యవరోధి=అత్యున్నతమైన యనుట.—అతిశయోక్తి.

వప్రవలయశ్రేణీ - ప్రాకారములు పెక్కు లనుట - హృద్యంబైనపద్యంబులన్ - "మువర్ణకాంత విశేషణంబుల బహువచనంబులకు ఏకవచనంబు బహుళముగా నగు" - బాల. కారక. 20.

---

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## షష్ఠాశ్వాసము

క. శ్రీకారి కృపార్ద్రేక్షణ, వైకుంఠ యకుంఠ, భక్తవరదపదాబ్జా
స్తోకమరందాయితగంగా, కాకోదరనగోదయస్థపతంగా. **1**

శ్రీకా...ణ-శ్రీ = సంపదను - కారి = చేయునదైన - కృపా = కరుణచేత - ఆర్ద్ర = తడిదైన - ఈక్షణ = చూపు గలవాఁడా, వైకుంఠ = వికుంఠాదేవియొక్క యపత్యమా, అకుంఠ = భంగములేని వాఁడా, భక్తవరద = భక్తులకు వరములను ఇచ్చువాఁడా, పదా...గా-పద అబ్జ = కమలములవంటి యడుగులకు-అస్తోక = బహుళమైన-మరందాయిత = మకరందమువలె నాచరించుచున్న-గంగా = గంగానది కలవాఁడా, కా...గా-కాకోదర నగ = శేషశైలము (వేంకటాద్రి) యనెడి-ఉదయ = పొడుపుమలయందు-స్థ = ఉన్నట్టి-పతంగా = సూర్యుఁడా, (అవధరింపుము అని తర్వాతికి అన్వయము).

పదాబ్జమరందాయితగంగా - పూజలో 'కృష్ణపాదసముద్భూతే గఙ్గే త్రిపథగామిని' అని గంగాసంబుద్ధి. గంగ విష్ణుపాదమందుఁ బుట్టినది.—ఉపమాలంకారము; 'కాకోదరనగోదయస్థపతంగా'-రూపకాలంకారము. శ్రీమన్నారాయణుని కృపాకటాక్షముచేత సంపదలు కలుగును; ఆయన వికుంఠాదేవికుమారుఁడు 'కుణ్డలీ గూఢపాచ్చక్షుశ్శ్రవాః కాకోదరః ఫణీ'-'శైలవృక్షౌ నగావగౌ' - 'ఉదయః పూర్వపర్వతః' - 'పతఙ్గౌ పక్షిసూర్యౌచ' - 'విష్ణుర్నారాయణః కృష్ణో వైకుణ్ఠో విష్టరశ్రవాః' అమ.

వేంకటాద్రికి నిమిత్తవిశేషములచే-చింతామణి, జ్ఞానాద్రి, తీర్థాచలము, పుష్కరశైలము, కనకాచలము, నారాయణాద్రి, వైకుంఠాద్రి, నరసింహాద్రి, అంజనాద్రి, వరాహాద్రి, నీలగిరి, శ్రీనివాసాచలము, ఆనందాచలము, శ్రీసద్గిరి, క్రీడాచలము, గారుడాద్రి, శేషాచలము, వృషాద్రి, అనిపేరులు కలవు; శ్రీవేంకటాచలమాహాత్మ్యమును చూ. చతుర్థపాదమున గంగా అను సంబుద్ధిం బట్టి ప్లుతయతి గానోపు.

వ. అవధరింపు మనంతర వృత్తాంతంబు. **2**

—* మాలదాసరి. *—

చ. కలఁ డొకరుండు పేరుకొనఁ గాని కులంబు మదీయభక్తుఁ, డి
య్యిల మును వాఁడు వామనత నే వసియింపనొ పుణ్యభూమి, నం
దుల కొకయోజనత్రయపు దూరపుటూర వసించి, బ్రాహ్మవే
ళలఁ జనుదెంచి, పాడు మము లాలస మంగళనామ కైశికిన్. **3**

ఒకరుండు, పేరుకొనఁగానికులంబు = చెప్పరానిజాతి (వాఁడు), మదీయభక్తుఁడు = నాయొక్క డింగరీఁడు, కలఁడు = ఉండెను, వాఁడు, మును = పూర్వము, ఈయిలన్ = ఈలోకములో,

ఏన్ = నేను, వామనతన్ = వామనావతారమందు, పుణ్యభూమిన్ = ఒకపావనక్షేత్రమందు, వసియింపనో = నివసించియుండలేదా, అందులకున్ = ఆ యాశ్రమమునకు, యోజనత్రయపు దూరపుటూరన్ = మూఁడామడల దూరపు గ్రామమందు, వసించి = నివాసముండి, బ్రాహ్మవేళలన్ = రాత్రికడపటిజాములోని పూర్వార్ధమందు, చనుదెంచి = వచ్చి, మనున్ = నన్ను (నా స్తుతులను) లాలసన్ = మహాభిలాషతో, మంగళనామకైశికిన్ = మంగళ మను పేరికైశికితో (మంగళ కైశికీరాగమున ననుట), పాడున్ = గానముసేయును.

తా.— నాభక్తుఁ డొకఁడు మాలదాసరి యుండెను. వాఁడు పూర్వము వామనావతారమున నేను వసించిన పుణ్యాశ్రమమునకు మూఁడామడలదూరమున నొక గ్రామములో వసించుచుండి, ప్రతిదినము బ్రాహ్మముహూర్తమున ఇచ్చటికి వచ్చి నాస్తోత్రములు మంగళ కైశికి యను రాగమునం బాడుచుండును.— అని వస్తునిర్దేశము.

శ్రీ వామనమూర్తి నివసించిన దివ్యదేశమునకు అరవమున 'కురుంగుడి' యని పేరు. మాలదాసరి * కైశికీరాగముం బాడినందులకు —

> "యా న్త్వయా పశ్చిమం గీతం స్వరం కైశికసంజ్ఞకం
> ఫలేన తస్య భద్రన్తే మోక్షయిష్యామి కిల్బిషాత్."

శ్రీభగవాను వాచ:—

> "యస్తు గాయతి సంయుక్తం కైశికం విష్ణుసంసది
> స తారయతి దుర్గాణి శ్వపాకో రాక్షసం యథా."-కైశికపురాణము.

ఇంకను పట్టికలో కైశిక (వైశిక) శబ్దము క్రింద చూచునది.

వ. అహరహంబు నన్నుఁ బ్రస్తుతించుచు.

అహరహంబు = ప్రత్యహము - ప్రతిదినము.

> క. జాత్యుచితచరిత్రము। మత్ప్రీత్యర్థం బూఁది తనదు హృదయము శుచితా
> నిత్యంబుగఁ దత్తనుసాం। గత్యము మసిపాఁత మాని కంబై యొదుఁగన్. 5

జా...మ - జాతి = (తనదైన) చండాలజాతికి - ఉచిత = తగినదైన - చరిత్రము = నడవడియే, మ...బు - మత్ = నాయొక్క - ప్రీత్యర్థంబు = సంతోషముకొఱకు, ఊఁది = అవలంబించి, తనదు హృదయము = తన మనస్సు శుచితా నిత్యంబుగన్ = శుద్ధత్వమందు స్థిరము అగునట్లుగా, త...సు-తత్ = ఆ - తను = దేహముతోడి - సాంగత్యము = కూడిక, మసిపాఁతమానికంబు = మసిగుడ్డ పేలికలో ముడిఁచిన కెంపు (చందము), ఐ, ఒదుఁగన్ = ఓసరిల్లియుండఁగా (అనఁగా ఆత్మశుద్ధికి కొదువ సేయనిదై యుండఁగా).

తా.— వాఁడు నాప్రీతికొఱకు తనమాలజాతికి ఏర్పడిన ధర్మమే ఆచరించుచు, మనస్సును ఎప్పుడును శుచిగా నుంచుకొని, తనకు ఆ మాలదేహము, మానికమునకు దానినిముడిఁచిన మసిపాఁత యెట్లో అట్లే ఏ దోషమును చేయనేరనిదై యుండఁగా.—

వాక్యార్థగత నిదర్శనాలంకారము.—

> "బింబ ప్రతిబింబత్వా। ప్తంబు లగు విశేషణములఁ దాల్చిన యిరు ధ
> ర్మంబుల కేకత్వము కథి। తం బగు వాక్యార్థగత నిదర్శనయందున్;
> ఎది దాతసౌమ్యతయొ య। ల్లదియే సంపూర్ణశశికి నకళంకత నాన్."

---

* 15 మేళకర్త, సమగమప - సనిధపమగరిస.

క్షత్త్రధర్మ మైనయుద్ధమును మాని విప్రధర్మ మైనశాంతి నవలంబింప దొరంకొన్న యర్జునునికి శ్రీకృష్ణులవారు జాత్యాచారము నతిక్రమింపఁగూడ దని ఇట్లు ఉపదేశించినారు.

> శ్రేయాం త్స్వధర్మో విగుణః। పరధర్మా త్స్వనుష్ఠితాత్
> స్వధర్మే నిధనం శ్రేయః। పరధర్మో భయావహః.

అభిజ్ఞాన శాకుంతలములో చెంబడివాఁడు ఈ యర్థమునే

> "శహావి కిళ జే విణిందియే। ణ హు జే కమ్మ వివజ్జణీయ యే."

అని యనువదించినాఁడు. 'మశిపాఁత మానికంబు'-మసిపాఁతలో కట్టియుంచిన మాణిక్యమునకు నలుపు కలుఁగనట్లు, చండాలదేహమునం దున్నను తనశుద్ధహృదయమునకు పాపము సోఁకకుండె ననుట.—మానికంబు—ప్ర. మాణిక్యమ్.

సీ. చము రైన తోల్కుబుసంబు టెక్కియును ని
 త్తడి శంఖ చక్ర కుండలము లమర,
దివెదారికొమ్ముఁ దోల్తిత్తియు జోడమ్ము
 మెడ మీఁది మొగలాకు గొడుగుఁ దనర,
మత్పాదరక్షయు మావు పెన్వెఱకఁగు
 ట్టిన యోటి తిపిరిదండెయును మెఱయఁ,
జిటితాళములు సంక పుటిక నొక్కొకమాటు
 గతిరయంబునఁ దాఁకి కలసి మొరయ,
తే. వలుద వనమాలకంఠెయు మలిన తనువుఁ
 బట్టెతిరుమన్ను బెదరుఁగెంబుట్టుఁజూపుఁ
 బసుపుఁబొడితోలువల్లంబు నెసక మెసఁగ
 వచ్చు సేవింప సురియాళు వైష్ణవుండు. 6

మాలదాసరియొక్క పరికరమును వర్ణించుచున్నాఁడు:—

(1) సురియాళు వైష్ణవుండు = విష్ణుభక్తుఁ డైనయామాలవాఁడు (మాలదాసరి యనుట) చమురు ఐన తోలు కుబుసంబున్ = చమురు తగిలిన తోలుచొక్కాయును, టెక్కియును = (చము రైన) టోపియును, ఇత్తడి శంఖచక్ర కుండలములు = శంఖప్రతిమతోనొకటియు చక్రప్రతిమతో నొకటియుఁగా ఇత్తడితోఁజేయఁబడిన చెవికమ్మలును, అమరన్ = ఒప్పుచుండఁగా;

(2) దివెదారికొమ్ము = దీపస్తంభంబును (లేక ఆపేరియాయుధ విశేషంబును), తోలు తిత్తియు = చర్మపుసంచియు, జోడమ్ము = చేయమ్మును (బోడమ్మను పాఠమున - ములికిలేని బాణంబును), మెడమీఁద, మొగలి ఆకు గొడుగున్, తనరన్ = ఒప్పఁగా;

(3) మత్ పాదరక్షయున్ = నా పాదుకయు, మావు పెను వెఱకన్ = గుఱ్ఱపు నిడుద వెండ్రుకతో, కట్టిన ఓటి తిపిరి దండెయును = కట్టినట్టి చీలిన యల్పపుఁ గిన్నెరయును, మెఱయన్ = ఒప్పుచుండఁగా; ['మావుపెన్నెఱక' శ. ర. పా. 'మావుపెన్వెఱక' శ. ర. పా. తాదిపదములలో 'తిబిరి' కలదు; 'తిపిరి' లేదు, 'వెఱక' క్రింద 'తిపిరి' కలదు; నాదులలో - నెఱక = వెండ్రుక;]

(4) చిటితాళములు = మ్రానితోఁ జేసిన చిన్న తాళములు, చంకపుటికన్ = చంకలో వ్రేలుచున్న బుట్టకు, ఒక్కొకమాటు = అప్పుడప్పుడు, గతిరయంబునన్ = నడకవడిచేత, తాఁకి = తగిలి, కలసి = ఒక తాళపుఁగొయ్యతో ఇంకొక తాళపుంగొయ్య కూడి, మొరయన్ = శబ్దించుచుండఁగా;

(5) తులుదవనమాల కంఠెయున్ = పెదపెద్ద తులసిపూసల తావళమయిన కంఠహారంబును, మలినతనువు = నల్లని దేహంబును, పట్టెతిరుమన్నున్ = తిరుమణితో వెడల్పుగాను దళముగాను ధరించిన పట్టెవర్ధనంబును, బెదరు కెంపు ఉట్టు చూపున్ = ఎఱుపు తేరుచున్న బెదరు దృష్టులును, పసుపుఁ బాడితోలు వల్వంబు = పసుపు పాడిగల తోలుసంచియు, ఎసక మెసఁగన్ = ఒప్పారుచుండఁగా, సేవింపన్ = నన్నుం గొలుచుటకు, వచ్చున్ = వచ్చుచుండెను.

"తూర్పుసాక్ష్య యులరు దుత్తాయి యగదట్టి కుప్పసం బంగి కుబుస మనఁగ" - ఆం. భా. "ప్రబలు వస్త్రముకుటము కుల్లా కుళ్లాయి। యనఁగ దద్భేదము తపార మనఁగఁ దెక్కె। యనఁగఁ జొతనఁ డోపి నా నలరు నభవ". ఆం. భా. [అనుబంధము. చూ.] "ఁంకకొమ్ములు రెండు చేర్చి యల్గులమర్చి। డాఁకేలఁ బూన నొడ్డనఁగ బొడువ। సంగతి గలయది సింగోటి యనఁగను దివిదారికొమ్ము నాఁ దేజరిల్లు।' - ఆం. భా. దివెదారి - పా. దెవిదారి _ దివెదార; "చాపాన పేక్షితశర మొప్పుచుండుఁ జేయు మ్మం చనంగ జో డమ్మనంగ" ఆం. భా. మొగలాకు-సంజ్ఞాశబ్దములందు స్వరసంధి బహుళము. పెన్వెఱక - పా. పెన్నెఱక, వెన్నెఱక; "చిటితాళ మనఁగను జెంగునాఁ జేఁగంట। యన వాద్యభేదంబు లలరుచుండు" - ఆం. భా. "బుట్ట పుట్టిక పుట్టి పుటిక యనఁగ। దనరును బిటకంబు" _ ఆం. భా. వల్వంబు - రూ. వల్లువము - వల్లము = వరహాలజాలె - అని శ. ర. ఇట జాలె సంచిమాత్రము. సురియాళు - "పరఁగుఁ జండాలుండు సురియాళు వనఁగను మాలఁ డం చనఁగను మాలఁ డనఁగ" - ఆం. భా. "సురియ+ఆళు" "ఇందు ఉత్తరపదము అఱవము" శ. ర. సురియ = సురకత్తి "సురె సురియ చూరి యనఁగను ఛురిక దనరు" - ఆం. భా. సురియాళు× సురియాళువు. 'ఇ। త్తడి శంఖ చక్ర కుండలము లమర'. ఇందు లడప్రాసము-"పెద్దళాకును దనకు నభేద మగుట, లళలకు నభేద మట్లన నలరుకతన। క్షితినిమూఁడవసరళంబు। యతులఁ బ్రాసములను లఘ్వలఘులకారములకు నిలుచు" - అప్ప. మఱియు, 'ఇత్తడి'కి ఇత్తళి ఇత్తలి అను రూ. బ్రౌనుపఠితములు గలవు.

శా. గండాభోగముల న్మదశ్రులహరు ల్గప్ప న్నుతు ల్పాడి యా
దండ న్వ్రేఁగులు డించి భక్తి జనితో ద్యత్తాండవం బాడు నా
చండాలేతరశీలుఁ డుత్పులకుఁడై చాండాలిక న్మీఁటుచున్
గుండు ల్నీరుగ నెండ గాలి పసి తాఁకుం జూడ కాప్రాహ్ణముల్. 7

ఆచండాల ఇతర శీలుఁడు = చండాలురకు విపరీతులైనవారియొక్క అనఁగా సాధువుల యొక్క ఆచరణవంటి యాచరణ గలవాఁడైన యామాలదాసరి, ఆదండన్ = ఆసమీపమున, వ్రేఁగులు = తనబరువులు (పరికరములు), డించి = ఉంచి, ఉత్పులకి - ఉత్ = ఉద్గతములయిన - పులకి = పులకములుకలవాఁడు, ఐ, ఎండన్ = ఆతపమును, గాలిన్ = కసురుగాలిని, పసితాఁకున్ = ఆఁకటిదెబ్బను ['పసి' కి అఱవములో ఆఁకలి అర్థము], చూడక = తలంపక, ఆప్రాహ్ణముల్ = మధ్యాహ్నముదాఁక, గుండుల్ నీరుగన్ = రాలు కరఁగునట్లు, చాండాలికన్ = చండాలవీణను, మీటుచున్ = వాయించుచు, గండ ఆభోగములన్ = చెక్కిళ్లయొక్క - ఆభోగములన్ = పరిపూర్ణతల

యందు (చెక్కిళ్లనిండ), ముత్ అశ్రులహరుల్ = ఆనందబాష్పప్రవాహములు, కప్పన్ = కమ్ముకొనుచుండఁగా, నుతుల్ = మదీయస్తోత్రములు, పాడి = గానముచేసి, భక్తి...బు - భక్తి = మత్పరత్వముచేత - జనిత = పుట్టినదై - ఉద్యత్ = విజృంభించుచున్న - తాండవంబు = నాట్యమును, ఆడున్.

తా.—జాతిచేత చండాలుఁడైనను ఉత్తమోత్తములయొక్క యాచారమందు ఉన్నట్టి యా దాసరి (ప్రతిదినము తనబరువులు ఆచెంతను దింపి ఎండను గాలిని ఆఁకటిని తలంపక మధ్యాహ్నమువఱకు ఒడలంతయు గగుర్కొనుచుండఁగా, రాలు కరఁగునట్లు, తనచండాలవీణను వాయించుచు, ఆనందబాష్పములు చెక్కిళ్లను నిండుగా కమ్మివైచుచుండఁగా, నాస్తోత్రములు పాడి భక్త్యుద్రేకముతో తాండవ మాడును.—

ఇందు బాష్పరోమాంచము లనెడు సాత్త్వికభావములు చెప్పఁబడినవి.—'గణ్డౌ కపోలౌ,' 'ఆభోగః పరిపూర్ణతా,' ముత్ప్రీతిః ప్రమదో హర్షః ప్రమోదామోద సమ్మదాః। స్యాదానన్దథురానన్దః,' - అమ. లహరీ - "నభోవాహినీ లహరీ శీతలగంధవాహా..." మను. 'చణ్డాలికా తు కణ్డోలవీణా చణ్డాలవల్లకీ' - అమ. - గుండు గ్నుగ్గగన్ - లోకోక్తి - శ్రోతలకు గానరస మెఱుఁగనివారికి సైతము అపరిమితానందము కలుగునట్లుగా.

'ప్రాహ్ణాపరాహ్ణ మధ్యాహ్న స్త్రిసంధ్యమ్' - అమ.—

ప్రాహ్ణము మధ్యాహ్నము అపరాహ్ణము అని పగటిని మూఁడుసమభాగములు చేసినచో ప్రాహ్ణము తొలిపదిగడియ లగును. ఆ ప్రాహ్ణమున్ - ఆ పదిగడియలసేపును - అవ్యయీభావ సమాసము. 'ఉత్పులకియై' - ఉత్పులకుఁడై అని పఠించినచో కర్మధారయముపై మత్వర్థీయము తొలఁగును, బహువ్రీహిచేతనే కార్యమగును.

తే. అట్లు దడవుగఁ గొల్చి సాష్టాంగ మెఱఁగి
గర్భమంటపిఁ గడిగిన కలఁకజలము
లోని తొట్టి నిండి కాలువగఁ జాఁగి
గుడి వెడలి వచ్చునది శూద్రుఁ డిడఁగఁ గ్రోలి, 8

అట్లు = ఆప్రకారముగా, తడవుగన్ = చాలసేపు, కొల్చి = నన్ను సేవించి, సాష్టాంగము = ఎనిమిది యంగములు నేలకు తగులునట్లుగా, ఎఱఁగి = మ్రొక్కి, గర్భమంటపిన్ = గర్భగృహమును, కడిగిన కలఁకజలము = కడిగిన మలినోదకమును, లోని తొట్టి నిండి = గుడిలోపలి తొట్టి పూర్తియై, కాలువగన్, చాఁగి = పాఱి, గుడి వెడలి వచ్చునది = గుడినుండి వెలికి పాఱుచున్నట్టి దానిని, శూద్రుఁడు, ఇడఁగన్ = తనకు ఒసంగఁగా, క్రోలి = త్రాగి; - తర్వాతి వాక్యముతో నన్వయము.

సాష్టాంగము—

"కరయుగములుఁ జరణంబులు । నురము లలాటస్థలంబు నున్నతభుజముల్
సరి ధరణి మోపి మ్రొక్కినఁ । బరువడి సాష్టాంగమండ్రు పరమమునీంద్రుల్."

గర్భ...నది = తొట్టితీర్థమును, శూద్రుఁడు - అతఁడు సమీపమునకు రావచ్చును గాన; బ్రాహ్మణాదులకు అర్చకుఁడే హరిపాదోదకమును ఇచ్చును. కలఁక - భక్త్యతిరేకముచే కలఁకయు అతి ప్రియమే అగును.

ఉ. ఆతఁడు ముఖ్యజాతిఁ గని నంతన పాయుచు, నెండ గాలి నెం
తో తడవుం బ్రసాద వినియోగము వార్చి వసించుచుం, ద్రివ
ర్ణేతరజాతి మెచ్చి దయనిడ్డ ప్రసాదము దండె సాఁచి శ్ర
ద్ధాతిశయంబునన్ వినతి నంది, భుజించుఁ, గొనుం దదంబువున్. 9

ఆతఁడు = ఆ దాసరి, ముఖ్యజాతిన్ = ఉత్తమవర్ణమువారయిన ద్విజాదులను, కనినంతన = చూచినవెంటనే, పాయుచున్ = ఎడయుచు, ఎండన్ = ఎండలోను, గాలిన్ = కసురు విసురుగాలిలోను, ఎంతో తడవున్ = మిక్కిలి ఎక్కువసేపు, ప్రసాద వినియోగము = భగవత్ప్రసాదము (తన కంటె ఉత్తమజాతులకు) పంపకము అగుటకు, వార్చి = కనిపెట్టుకొని, వసించుచున్ = ఉండి, త్రివర్ణ ఇతర జాతి = బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులనెడి మూఁడుజాతులవారు గాక ఇతరుఁడు, (శూద్రాది), మెచ్చి = తన శీలమునకు సంతోషించి, దయన్ = కరుణచేత, ఇడ్డ ప్రసాదమున్ = పెట్టిన ప్రసాదమును, దండెన్ = కిన్నెరను, సాఁచి = నిగిడ్చి, శ్రద్ధా అతిశయంబునన్ = విశ్వాసాతిరేకముతో, వినతిన్ = నమస్కార పూర్వకముగా, అంది = పుచ్చుకొని, భుజించున్ = సాపడును, తదంబువున్ = ప్రసాదము పెట్టినవాఁడు ఒసంగిన తీర్థమును, కొనున్ = త్రాగును.

తా.— ఆ దాసరి బ్రాహ్మణాద్యుత్తమజాతివారిని చూడఁగానే దూరముగాఁ బోవును; ఎండను గాలిని తలంపక ఎంతసేపయిననుండి స్వామిప్రసాదము వినియుక్తమగు నందాఁక వేచియుండి, పిమ్మట ద్విజేతరుఁడు ఎవఁడైన ఇతనిభగవద్భక్తికి మెచ్చి తాఁదెచ్చుకొన్న ప్రసాదములో దయచేసిపెట్టిన కొంత తన కిన్నెరనుచాఁచి దానిమీఁద నుంపించి ఆయనకు మ్రొక్కి స్వీకరించి విశ్వాసపూర్వకముగా సాపడ, ఆప్రసాదదాత యిచ్చినతీర్థమును త్రాగును.

పాని.— ఇతఁడు సమీపించిన వారు మైలపడుదురుగాన, అట్లు వారు మైలపడకయుండుటకై కనినంతనె - ఎకారము ఇతనిసదాచారాసక్తిని మఱియు స్ఫుటీకరించుచున్నది. శ్రద్ధ - ఆప్రసాదము తన్ను సంసారసాగరమునుండి యుద్ధరించునని విశ్వాసము. వినతి - కృతజ్ఞతచేత, దండెము మీఁద గ్రహించుట ప్రసాదదాతకు స్పర్శదోషము కలుగకుండుటకు - వార్చి - "భవదాగమనంబు వార్చి నియతవృత్తి నున్నవాఁడ." భార. శాం. ౬. ఆ - శ. ర.

వ. ఇట్లు దన దివాకీర్తిజని నగు పరమార్తి నైచ్యంబు సకలజన శోచ్యంబుగా గుడి లాఁపరా *తూపరాణి కడ నిలిచి బహిరావరణ ప్రదక్షిణంబు గావించి ప్రొద్దెక్క నిజపక్కణంబునకుం బోవుచుండు నిట్లుండి యొక్కనాఁడు. 10

...దివాకీర్తిజనిన్ = చండాల జన్మముచేత, అగు...బు - అగు=సంప్రాప్తమయిన - పరమ = మిక్కుటమయిన - ఆర్తి=ఇబ్బందిచేతనయిన - నైచ్యంబు=నీచత్వము (దూరమున నుండుట అస్పృశ్యత లోనగు నధమతి), కాన్ = అగునట్లుగా, గుడి...డన్ - గుడి=కోవెలయొక్క - లాఁపరా= జలనిర్గమద్వారమును మూయు సరంధ్రశిలాఫలకము తోడి_తూపరాణికడన్ =నీరు వెలువడుతూము నొద్ద, నిలిచి = నిలువంబడియుండి, బహిరావరణ ప్రదక్షిణంబు గావించి = బయటి ప్రాకారమును మాత్రమే వలగొని - ప్రొద్దు ఎక్కన్, నిజపక్కణంబునకున్ =తనమాలవాడకు.

* తూపరాయి, తూపళాయి, తూప్లాయి అని గ్రామ్యములు; తూముయొక్క ఱాయి తూపఱాయిగా నుండునేమో.

"చణ్డాల ప్లవ మాతఙ్గ దివాకీర్తి జనఙ్గమాః"-"అర్త్తిః పీడాధనుష్కోట్యోః,"-"పక్కణః శబరాలయః" - అమ.

"తూపరాణపు టమ్ము తూ ముప్పరము జల। దారి యనంగను దనరును జల। నిర్గమము తన్ను ఖంబున నీటితోడ। వచ్చు తృణములఁ బోరని నిపలక పేరు। లాఁపరా యంచు జనులు పల్కఁగను వెలయు." - ఆం. భా.

క. అర్ధమరే యద్దాసరి। యద్దండ బిడాలగాహి తాలయ కృకవా
కూద్దండ రవము విని చను। ప్రాద్ధాయె నటంచుఁ బాడఁ బోవుచు త్రోవన్. **11**

అద్దాసరి, అర్ధమరే(యి) =అర్ధరాత్రంబున, అద్దండన్ = అ సమీపమున, బిడా...మున్ - బిడాల = పిల్లి చేత - గాహిత = చొరఁబడిన - ఆలయ = ఇంటిలోని - కృకవాకు - కోళ్ల యొక్క - ఉద్దండ=బిగ్గరయైన - రవము=కూఁతను, విని, చను ప్రాద్దు అయెనటంచున్ =(స్వామి సేవకు) తరలు వేళ అయినదని (తలంచుకొని), పాడన్ = నాస్తుతులు పాడుటకై, పోవుచున్, త్రోవ = మార్గమందు (అవతలికి అన్వయము).

తా.—ఒకనాఁడు ఆదాసరి అర్ధరాత్రమున అసంత నొకయింట పిల్లి చొరఁగా, దానికి వెఱచి కోళ్లు కూయఁగా, ఆ కూఁతలు వేగుప్రాద్దుకోడికూఁత అని తలఁచినవాఁడై వెంటనే లేచి నన్నుం బాడుటకై వచ్చుచు దారిలో.—

"నడిరాతిరి యన। నడిరేయి యనఁగఁ గాం। దారి మాంద్యారి పొ। ద్దన సరిప్రాద్దన నద్దమరెయి। యన నిశీథాఖ్య దగు" ఆం. భా.

ఆ. మరులుఁ దీఁగ మెట్టి యిరు లన్న నో యని
యొడు తమిస్రఁ గాడుపడి పొలంబు
లెల్లఁ దిరిగి తూర్పు దెల్ల నౌనటి నొక్క
శూన్యగహనవాటిఁ జొచ్చి చనుచు. **12**

మరులుఁ దీఁగన్ = మర్లుమాతంగి తీఁగను (దీనిని త్రొక్కినవారు దారితప్పెదురు), మెట్టి=త్రొక్కి, ఇరులు = ఓ చీకటీ, అన్నన్ = అని పిలిచిన, ఓ అనియెడి తమిస్రన్ = ఏమి అని బదులు పలుకునట్టి చీకటి రాత్రియందు, కాడుపడి = దారితప్పి దిగ్భ్రమగొని, పొలంబులు= చోట్లు...శూన్యగహనవాటిన్ = నిర్మానుష్యపుటడవి ప్రదేశమును,..."చీకటి యిరులునాఁ జెలువొందు"-ఆం. భా.

'ఇరులన్న నో యనియెడు' - అతిశయోక్తి - గాఢాంధకారముగల యని భా. "తమిస్రా తామసీ రాత్రిః" అమ. ఇరులు-సంబుద్ధి- పలుకుము అనుమధ్యమ పురుషము ఊహ్యము. మరులుఁ దీఁగ-చూ. పట్టిక. "ఓ యన నేమి నా నొప్పుఁ గి మర్థమై"_ఆం. భా.

సీ. ఇడిసిన యిదుపుల యొడలఁ బొర్రే సుత్త
రేను గసెంద కోరింద పొదలఁ
గెడసిన గరిసెల క్రింద లాఁగలఁ గ్రుస్సి
యదన కాఁపురముండు నాఖుతతుల

సగము దుమ్మునఁ బూడి చిగిరింత వామూయఁ
బెరిఁగిన నూతిపాఁతర బోటియలఁ
జీమలు ప్రాలీడ్వఁ జవికిన వెలుగుప
ట్టునఁ బండి యెండి క్రుంగిన గునుకులఁ
తే. పెంటదొగ్గళ్లలోఁ గడు పంటి శిశ్రు
చలనములఁ గ్రుక్కి జీర్ణోతువులఁ బొలంపు
దుండుగల మళ్లఁ యూరులఁ దూలి రాడు
చిక్కినేతాల పాడఱు సీమఁ జనుచు. 13

(1) ఇడి...లన్ - ఇడిసిన = కూలిపోయిన - ఇడుపుల = ద్వారపార్శ్వములయొక్క - ఎడలన్ = ప్రదేశములయందు, పొట్రే...లన్ - పొట్రేను = పొట్టిరేఁగు - ఉత్తరేను = అపామార్గము - కసింద = కాసమర్దము - కోరింద = జతూక - ఆనువాసి - పొదలన్ = పొదరుల చేతను; (2) కెడసిన గరిసెల క్రిందన్ = పడిపోయిన గాదెలకు దిగువను, అంకటన్ = క్షుధచేత, కృస్సి = కృశించి, అదవకాఁపు రము = అస్థిరనివాసముగా, ఉంకు - అఖు తతులన్ = పందికొక్కుల గుంపుల చేతను; (3) సగము = (నూతిగోతులయు పాఁతరగోతులయు) అర్ధభాగము, దుమ్మునన్ = ధూళిచేత, పూడి = నిండి, చిగి రింత, వా మూయన్ = ఆ గోతుల నోళ్లు మూఁతగా, పెరిఁగిన నూతి పాతర బోటియలన్ = బలిసిన బావులయు ధాన్యపాతములయు పల్లముల చేతను, (4) చీమలు - పిపీలికలు, ప్రాలు = గింజలను, ఈడ్వన్ = లాగికొనిపోఁగా, చివికిన వెలుగు పట్టులన్ = నారము వచ్చిన కంచెల తావులయందు, పండి = (గునుకధాన్యము) పక్వమై, ఎండి - శుష్కించి, క్రుంగిన గునుకులన్ = అణఁగిపోయిన గునుకు సస్యము చేతను;

పెంట దొగ్గళ్లలోన్ = పెంటలలోని దొగ్గలిచెట్లయందు, కడుపు అంటి = (తిండిలేమిచే అంటుకొని) కడుపు వెన్నునకు అంటుకొనిపోయి, శిశ్రుచలనములన్ = మీసాల కదలికను - క్రుక్కి జీర్ణోతువులన్ = అణఁచుకొనుచున్న ముదిపిల్లుల చేతను, పొలంపు దుండుగలన్ = చేలయందు బలియు కలుపు మొలకలచేతను, మళ్ల యూరులన్ = మడులయందలి బొరుగింటల చేతను, రాడు చిక్కి ఏతాలన్ = నిట్రాడు మిగిలియున్న ఏతాల చేతను, పాడఱు సీమన్ = పాడుపడిన ప్రదేశమందు. చనుచున్ = పోవుచు.

తా. — ద్వారపార్శ్వములు కూలిపోఁగా, ఆచోట్లు పొట్టిరేఁగులు - కసివెందలు - కోరిందలు - పొదలుగా బలిసినవి; గాదెలు పడిపోఁగా వాని క్రింద బొక్కలలో ఆఁకటి నకనకంబడుచు పందికొక్కులు తత్కాలమునకు కాఁపుర ముండినవి; బావులును పాఁతగోతులును దుమ్ముపడి సగము పూడిపోఁగా వాని నోళ్లకు మూఁతగా చిగిరింత పెరిఁగియుండినవి; చీమలు గునుకవరి గింజల నీడ్చుకొనిపోవు దారిలో నారము వచ్చిన కంచెలతావున ఆ గునుకగింజలు పడి మొలచి వన్నులు పెరిఁగి పండి ఎండి రాలి అణఁగి పోయినవి; పెంటలమీఁద పెరిఁగిన దొగ్గలిచెట్లలో ముదిపిల్లులు ఆఁకట నొగిలి కడు పంటుకొనిపోయి మీసాలనుగూడ కదపక పడియుండినవి; పొలములున్న తావుల గాదము పెరిఁగినవి; మళ్లలో బొరుగుబ్బులు మొండుకొన్నవి; ఏతాలు నాశమై, అవి యుండిన తావులందు వాని రాడులుమాత్రము మిగిలి ఒగిరిపోయి యుండినవి; అట్టి పాడు ప్రదేశములో ఆ దాసరి పోవుచుండెను. — స్వభావోక్తి.

'ఇడుపు'-'ఇంచు విల్కాని వ్రాసినా రిడుపులందు' నైష. 'పౌరకటి యిడుపు నాఁ బొసఁగు ద్వారప్రాంతమధ్యము.'-ఆం. భా. 'కెడసిన'-"ఎడసెఁ బురివిచ్చె నెడమయ్యెఁ గెడసెఁ జెంగెఁ। బాసెఁ గేడించె నాఁగను బరఁగుచుండు। వీడె ననుటకు."-ఆం. భా. 'క్రుంగిన'-"క్రుంగె డస్సె డిందెఁ గుదిసెఁ దూలె నణంగె। నవఁగఁ దగ్గె ననుట యలరు నభవ." - ఆం. భా. 'గరిసె'-"తగుఁ గుసూలాభిధ। గాదె యనంగను గరిసె యనఁగ."-ఆం. భా. "అదవకాఁ పనఁగను సద్దికాఁపు" - ఆం. భా. 'గునుకు' - "తృణధాన్యములు చెలంగు। గునుకులు దూసరుల్ గోలివె లనంగను" -ఆం. భా. 'పాత్రేను'=పాట్టిరేను_పాటిరేను. 'కసింద' = కసివెంద - ప్ర. కాసమర్దః. 'ఉన్దురు ర్మూషికోఽ ప్యాఖుః' - అమ. 'వా' _రూ. వాయి. 'తనూరుహం రోమ లోమ తద్వృద్ధే శ్మశ్రు పుంముఖే' _అమ. జీర్ణోతువు = జీర్ణ+ఓతుః - రూ. జీర్ణౌతుః - 'ఓతు ర్బిడాలో మార్జారః.' "ప్రవయాః స్థవిరో వృద్ధో జీవే జీర్ణో జరన్నపి" - అమ.

కొందఱు ఈపద్యమున, పాదలన్ _ తతులన్ - బొంతియలన్ - గునుకులన్ _ ఓతువులన్ - దుండుగులన్ - బౌరులన్ - ఏతాలన్ _ ఈతావులందెల్ల పాదలయొక్కయు - బొంతియలయొక్కయు- గునుకులయొక్కయు, ఓతువులయొక్కయు - దుండుగులయొక్కయు- బౌరులయొక్కయు, ఏతాలయొక్కయు _ అని 'యొక్క' యుండవలయునని వివరింతురు. "అపుడు సమ్మెటకోలల యంకుశముల చేఱుకోలలవ్రేటుల" (సమ్మెటకోలలయొక్కయు, అంకుశములయొక్కయు, చేఱుకోలలయొక్కయు వ్రేటులచేత నని యర్థము) చూ. ప్రౌఢవ్యాకరణము, కారక. ౧౬. ఇటను అట్లే అన్వయించుకొనఁదగును అని కొందఱమతము. ఈలుప్తయొక్కాంతములకన్నిటికిని "సీమ" తో నన్వయము. "మనుచుండు రాడు కంబమ్మన" ఆం. భా. ఏతాను - రూ. ఏతము. ప్రాలు - ఏక వచనము ప్రాయి.

క. అపమార్గత నరుగుచు మా। ర్గపు ధామార్గవపుఁ గంటకంబులఁ గాళ్లన్
విపరీతత నూడ్చుచు నే। రుపున న్బల్లేరు లీడ్చి త్రోయుచుఁ జనుచున్. 14

అపమార్గతన్ = తప్పుదారిలో, అరుగుచున్ = పోవుచు, మా...లన్ - మార్గపు = దారిలోని - ధామార్గవపు=ఉత్తరేని - కంటకంబులన్=ముండ్లను, కాళ్లన్ = కాళ్లనుండి, విపరీతతన్ - ప్రతిలోమముగా, ఊడ్చుచున్ =తుడిచివైచికొనుచు, పల్లేరులు=పల్లేరుఁగాయలముండ్లను, నేరుపునన్ = మెలఁకువతో, ఈడ్చి = ఊడలాగి, త్రోయుచున్ =పాఱవైచుచు, చనుచున్ = పోవుచు (తరువాతి పద్యమున కన్వయము.)

దారి తప్పి నడచుచు ఉత్తరేనికాయలు కాళ్లంబట్టుకొనఁగా, వానిని ఎదురుగ తుడిచిన తెగును గావున, విపరీతముగా తుడిచివైచుచు, అట్లే పల్లెరుగాయలు గ్రుచ్చుకొన్న నుపాయముగా తొలఁగించుకొనుచు, పోవుచుండెను. ధామార్గవపు - చూ. పట్టిక _ "అపామార్గః శైఖరికో ధామార్గవ మయూరకౌ." అమ.

శా. కాంచె న్వైష్ణవుఁ డర్ధ యోజన జటా ఘూటోత్థ శాఖోపశా
ఖాంచజ్ఝాట చర న్మరు ద్ద్రయ దవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచ త్కీటకృత వ్రణచ్ఛలన లి ప్యాపాది తాధ్వన్య సి
స్సంచారాత్త మహాఫలోపమ ఫల స్ఫాయ ద్వటక్ష్మాజమున్. 15

వైష్ణవుఁడు = ఆ విష్ణుభక్తుఁడు, అర్ధ...యుక్-అర్ధయోజన=సగమామడ (అనఁగా రెండు క్రోసులు) నిడివిగల-జటా = ఊడలయొక్క-ఘాటా=పైభాగపుఁ బ్రక్కలనుండి-ఉత్థ = మొలచిన - శాఖా = కొమ్మలయు - ఉపశాఖా = ఆ కొమ్మల కొమ్మలయు - అంచత్ = పర్వుచున్న - ఝాట=సమూహములనుండి-చరత్ = సంచరించుచున్న-మరుత్=గాలియొక్క-రయ=వేగముచేత - దవీయః=దూరమునకు-ప్రేషిత=పంపఁబడినవై-ఉద్యత్=పోవుచున్న-ఛద = ఆకులయందు - ఉదంచత్=ఒప్పుచున్న-కీట కృత వ్రణ=పురుగులచేత చేయఁబడిన బొక్క లనెడి-ఛలన = మిషగల - లిపి=వ్రాఁతచేత-అపాదిత = సమకూర్పఁబడిన - అధ్వన్య నిస్సంచార=బాటసారుల నడయాడుట లేనందున-ఆత్త=పొందఁబడిన- మహాఫల=గొప్పఫలము (మహాపుణ్య మనుట)-ఉపమా = సాటిగాఁ గలవైన-ఫల = పండ్లచేత-స్ఫాయత్ = విస్తరిల్లుచున్న-వటక్ష్మాజమున్ = మఱ్ఱిచెట్టును-కాంచెన్.

తా.—ఆ విష్ణుభక్తుఁడు అట్లు పోవుచుండఁగా నాతనికి పెద్దమఱ్ఱిచెట్టొకటి గానిపించెను. దానికి రెండేసి క్రోసుల నిడివిగల యూడలు దిగియుండెను, వాని పైభాగములనుండి కొమ్మలు మొలచినవి; ఆ కొమ్మలనుండియు, కొమ్మలు మొలచినవి. ఈ మహాసముదాయములో గాలి చరించుచుండినది. దాని వేగముచేత చెట్టునుండి పురుగులు దొలిచిన గీఱలతోడియాకులు ఎగిరిపోయి దూరమున నడతెంచుచున్న తెరువరులకడం బడుచుండును. వారు ఈ చెట్టునందును బ్రహ్మరక్షస్సు ఉన్నదను ప్రతీతి యొకఁగి దీనిని దవ్వుక దూరముగా పోవుచుందురు. అందువలన ఆ యాకులలోని యా గీఱలు "అయ్యా, మీరు నాకడకు రాకుఁడు, నాయందు బ్రహ్మరాక్షసి యొకఁడున్నాఁడు, వాఁడు మిమ్ము భక్షించును," అని యా తెరువరులకు ఆమఱ్ఱి వ్రాసిన హెచ్చరిక జాబులో యని తలంపఁదగియుండెను. మఱియును అందువలననే అట్లు హెచ్చరించి రానీయకుండ ఆఁపి వారి ప్రాణమును గాచిన మహాపుణ్యంపుఫలములో యనునట్లుగా చెట్టునిండ లెక్కలేనిపండ్లు ఒప్పుచుండెను.— సాపహ్నవోత్ప్రేక్షాలంకారము.

'ఝాట'-పట్టికం జూడుఁడు, ఒంగు రీతి గాడి. 'ఘాటా' - 'అవటుర్ఘాటా కృకాటికా'- అమ. ఘాటయనఁగా పెడతల, లేక, ముచ్చిలిగుంట, లేక, జటయందు పైభాగమున ప్రక్కలనుండు తావునకు లక్షణచే నిటం బ్రయుక్తము. 'దవీయస్' 'దవిష్ఠ'-దూరశబ్దమునకు అతిశయార్థమున రూపములు. 'స్ఫాయత్' - చూ. 1 (72) టీక.

ఆ. కాంచి యాతఁ డొక్క కాలిత్రోవయు నంతఁ
గాంచి యందుఁ దెరువుఁ గాంచినదియ
పరమలబ్ధి గానఁ ద్వరితంపుగతి నవ్వ
టావనీజ మంత నంతఁ గదిసి. 16

అతఁడు=ఆ దాసరి, కాంచి=ఆమఱ్ఱిని చూచి, అంతన్=అంతట, కాలిత్రోవయున్=ఒక్క కాలిడొంకనుగూడ, కాంచి, అందున్=ఆ పాడుసీమలో, తెరువుఁగాంచినదియ=దారిదొరకుటయే, పరమలబ్ధి = ఉత్కృష్టమయినలాభము, కానన్ = కావున, త్వరితంపుగతిన్ = వడితోఁగూడిన నడకచే, అవ్వట అవనీజము=ఆ మఱ్ఱిచెట్టును, అంతనంతన్ = క్రమక్రమముగా, కదిసి=సమీపించి, (తర్వాతిపద్యములో నన్వయము).

"మార్గంబు తెరువు త్రోవ దారి తెన్ను సరవి
చనుప నడవ-బొప్పు జాడ డొంక యనంగ."-ఆం. భా.

సీ. ఎలనీటి బొండలంబులు వోలె మెదడెల్ల
జుట్టి పైచిన డొల్లు పుత్తెగములు,
నెఱచి గీఱిన జీర లేర్పడఁ దుదముట్టఁ
జీకిన నులిపచ్చి కీకసములు,
దోనదోన యను నీఁగెతుట్టెల రూ పేఱు
పడక క్రొంపలను ప్రేలెడు గరుసులు
దూర్లె మక్కెక్కి మంగళ్లతిప్పలు రేఁగు
నడువున గాలి నాడెడు నెఱకలుఁ,

తే. దునిసిన నరాంగకములఁ బోత్తులను గఱచి
పోక యొండొంటితోఁ బోరి పీఁకులాడు
శ్వాపదంబులుఁ, బదహతి ప్రస్సి కలుచు
వరుగు దఱచగు ముఱుత్రోవ నరిగి యెదుట. 17

ఎలనీటి బొండలంబులు వోలెన్ = లేఁతవి యుండినవై ఒకవకరయే తలగొట్టిన లేఁతకొబ్బరికాయల వలె, మెదడు ఎల్లన్ = మస్తిష్కము అంతయును, జుట్టి = పీల్చి. పైచినన్ = పాఱవైవఁగా, డొల్లు పుత్తెగములున్ = దొరలుచున్న పునుక పెంకులును, (2) ఎఱచి = మాంసమును, గీఱిన జీరలు = గీఁకికొనఁగా కలిగిన గీఱలు. ఏర్పడన్ = స్ఫుటపడునట్లు, తుదముట్టన్ = నిశ్శేషముగా, జీక...లు - జీకిన = పండ్లతోఁ గీఁకి చప్పరించిన - నులిపచ్చి కీకసములున్ = కొంచెము పచ్చిగల యెముకలును, (3) దోన దోన అను ఈఁగ తుట్టెలన్ = దోనదోన యనుశబ్దముతో ముసరుకొనునట్టి యీఁగల క్రిక్కిఱిసిన తుట్టుముల చేత, రూపు ఏఱుపడక = స్వరూపము కానరాకుండ, క్రొంపలను = ముండ్ల కొమ్మల మీఁద, ప్రేలెడు గరుసులున్ = వ్రేలాడుచున్న పచ్చితోళ్లును. (4) దూర్లెన్ = దుమ్ముల చేతను. మక్కెక్కి = మాలిన్యము కప్పి, మంగళ్లతిప్పలు = మంగలవాండ్రు గొరిగిన వెండ్రుకతిప్పలు. రేఁగు నడువునన్ = ఎగసి వ్యాపించు రీతిగా, గాలిన్ = గాలిలో, ఆడెడు నెఱకలున్ = నెగయుచున్న వెండ్రుకలును,

తునిసిన నర అంగకములన్ = తుంగిపడియున్న మానవావయవములను, బోత్తులన్ = రెండు మూఁడు శ్వాపదములు కలసి తినుటగా, కఱచి = నోటఁగఱచుకొని, పోకన్ = పోవుటలో, ఒండొంటితోన్ = ఒక శ్వాపదము ఇంకొక శ్వాపదముతో, పోరి = కొట్లాడి, పీఁకు...లిన్ - పీఁకులాడు = పెనఁగులాడెడి - శ్వాపదంబులున్ = ఘాతుకజంతువులును - పదహతిన్ = వానికాళ్ల త్రొక్కుడుచేత, ప్రస్సి = నలిగి, కలుచు = వాసన రేఁగుచున్న - వరుగున్ = ఎండమాంసపుఁదునియలును (లేక వాసన కొట్టుచున్నదైన త్రోవను విశేషణముగా నొకపక్షము) - వరుగు = ఒకతెగ గద్దలు - (జాత్యేకవచనము), తఱచగు ముఱు త్రోవన్ = దట్టముగానున్న దుర్గంధపు మార్గమున, అరిగి = పోయి, ఎదుటన్ (అవలికన్వయము.)

తా.—ఆ దాసరి ఆ దుర్గంధపుదారిని అనుసరించి దరిసెను. దానినిండ ఎలనీటిని త్రాగి మీగడ నంటి లేఁతకొబ్బెరను గీఁకిగీఁకి తిని పాఱవైచిన బొంకాయబొండ్లములవలె లోని మెదడంతయు జుఱ్ఱి పాఱవైచిన పునుకలు మెండుగాఁబడియుండినవి.—[ఉపమాలంకారము.] అట్లే పండ్లతో

వేళయును గాదు, పొలగాలి వీచెఁ, దెరువు
నెడ, యనుచు జాలిగొని సంశయించువేళ. 18

(1) ముంగాళ్లన్ = ముందటిపాదములతో, చాఁగి = దేహమును దీర్ఘముగా నిగిడించి, పైన్ = చెట్టుమీఁదికి, ముచ్చుచూపులు = దొంగదృష్టులు, పర్వన్ = సాఁగుచుండఁగా, బొమికలు = ఎముకలను, ఎత్తుచున్ = నోటఁగొని, పాఱిపోవుకునులన్ = పలాయనమగుచున్న యాఁడుఁగుక్కలను;

(2) పలలతోరణములు = మాంస (ఖండ) ములు ప్రేలెడు తోరణములను, పట్టి = కాళ్లతో గ్రహించి, బిట్టు = తటాలున, ఎగయన్ = ఎగిరిపోవుచుండఁగా, శాఖాఘాతిన్ = కొమ్మయొక్క (కొమ్మను) కదలించుటచేత (లేక-పా. శాఖాహతిన్ = రెమ్మతోఁ గొట్టుటచేత), నెగయుకంకముల రొదలన్ = ఎగిరిపోయెడి గృధ్రముల గొల్లులను; (3) అడ్డంబుతిరిగి = అడ్డమువచ్చి, కర ఆహతిన్ = (వెనుకనున్న బొమ్మరక్కసునియొక్క) అరచేతిప్రేటును, పడి = పుచ్చుకొని, రొండిన్ = నడుము పార్శ్వమున, హస్తంబులు = చేతులను, ఇడి = ఉంచుకొని, అంగలార్చుకపులన్ = ఏడ్చుచున్న క్రోఁతులను; (4) దబ్బాటుమైన్ = ఆకస్మికముగా, ఒక్క యెడలన్ = ఒక కొన్ని ప్రదేశములందు, చూపి = అగపడఁజేసి, అవి = ఆ చూపినవ్యాపారములు, మాయన్ = మాసిపోవునట్లు (లేక జాలవిద్యచేతనుంబోలె), అడఁగన్ = అదృశ్యములు కాఁగా, వేఱు ఎడన్ = మఱియొక్కచోట-చూపు వ్యాపృతులను = కనఁబడునట్లు చేయఁబడుచున్న వ్యాపారములను;

కని = పరికించి, ఎవఁడో ఒక్కరుండు = ఎవఁడో ఒకఁడు, ఇందున్ = ఈ చెట్టుమీఁద, కలఁడు = ఉన్నాఁడు, (పా. ఎవ్వఁడోయొక్కఁడున్నవాఁడింగు), వాఁడు, నరుఁడు = మానవుఁడు, కాఁడు, ఇం...కున్ - ఇంధన = వంటకట్టియలు - ఆదిక = లోనగువానియొక్క - ఆహరణమునకున్ = తెచ్చుకొనునట్టి, వేళయున్ = సమయమేనియు, కాదు, పొలగాలి = మాంసగంధముగలగాలి, వీచెన్ = విసరుచున్నది, తెరువున్ = దారియు, ఎడవు = దూరము, అనుచున్ = అని తలపోయుచు, జాలిగొని = వెతఁగూరి, సంశయించువేళన్ = శంకాకులుఁడై యుండఁగా.

తా.—ఆ చెట్టుకడ, ఆఁడుఁగుక్కలు దొంగచూపులతో ఊర్ధ్వముగా ముందరికాళ్లుచాఁచి ఎముకలను కఱచుకొని పాఱిపోవుచుండినవి; గ్రద్దలు మాంసఖండముల తోరణములను అపహరించుకొని తటాలున ఎగసిపోవుటలో కొమ్మదెబ్బ తగులఁగా రొదవెట్టుచుండినవి; కొమ్మల మీఁద క్రోఁతులు అడ్డము వచ్చి వెనుకనుండి అరచేతిప్రేటుం బొంది, రెండుగొందులయందును రెండుచేతుల నుంచుకొని ఏడ్చుచుండినవి; ఉన్నట్టే ఉండి చెట్టున కొన్నిచోట్లు కంటికి అగపడునట్లుగాను, మరల అవి అదృశ్యములై వేఱుచోట్లు అగపడునట్లుగాను ఏవో వ్యాపారములు జరుగుచుండినవి.

దీని నెల్లం బరికించి ఆ దాసరి తనమనస్సులో, ఈ చెట్టున ఎవఁడో ఉన్నాఁడు, వాఁడు నరుఁడుగాఁడు, ఒకవేళ ఆకులు కట్టియలు కొనిపోవ వచ్చినవాఁడుగా నుండునా యనుటకు, ఇది అందులకు వేళ గాదు; పయిగా మాంసపుగాలి వీచుచున్నది, నేను పోవలసినదారి దూరమందున్నది.—స్వభావోక్తియు, అనుమానంబును.

'ముంగాళ్ల' జాఁగుట-చౌర్యాగ్రమగుటచేత, తన రాకయు ముచ్చిమియు చెట్టులోని రక్కసుని దృష్టిని ఆకర్షింపక యుండుటకు; పైఁజూచుట-అతఁడు చెట్టుమీఁదనుండి కనుచున్నాఁడో ఎఱుంగుటకు, కన్నచో ఒకదుముకు దుమికి తమ్ము రూపుమాపును గావున. పాఱిపోవుట-బొమికలను దక్కించుకొనుటకు, సురక్షిత ప్రదేశమునం జేరి ఆస్వాదించుటకు; కునులేమి-మగవి రావా? రావు;

వీనికి చొరవయు జత్తును ఎక్కువకావున ఇవి ముందువచ్చును. ఆ బొమ్మరాకాసి గ్రుచ్చి పెట్టుకొనియున్న మాంసఖండములతోడి తోరెములను గ్రద్దలు తన్నుకొనిపోవుచో, కొమ్మకుఁ దగులుకొని తోరెము రాక, కొమ్మ, మీఁదికి క్రిందికి ఊఁగులాడఁగా, లేక, అతఁడు చిన్నకొమ్మతో ఆ గ్రద్దలను వ్రేటువేయఁగా, అవి ఆ తోరెమును వదలుకొని ఎగిరి తొలంగుచు రొదపెట్టుచుండె నని భా.— 'అడ్డంబు' - వచ్చుచున్న దాసరిని పరికించుచున్న రాకాసికి మఱుఁగుగా. 'కరాహతి' - కరము రాకాసిది. 'రొండి' - చేతిదెబ్బ తగిలినచోటు. 'చూచి' - చెట్టులో బయలుగా నున్నచోట నేమో చేయుచు, రాకాసి ఆ బయలిని మఱుఁగుచేసెను, ఇంతలో అటనుండి తొలఁగి మఱియొకబయల నేమో చేయుచుండెను. 'నరుఁడుగామి' - మాయచేత రూపడంచుకొన్నందున. ఒకవేళ నరుఁడే అందుమేని, నరునియునికికి అది సమయము గాదు, పైగా పొలగాలిచే రాకాసి పొలకువ తోఁచుచున్నది; క్షణమయినను అట నుండఁదగదు; తనదారి కనుంగొని పోవుటకు అది అటకు కడు దూరము. "ఎవ్వఁడో యొక్కఁడున్నవాఁడు" అనుపాఠమున, పెద్దపాదముల తుది ద్వితీయలను తృతీయార్థకములనుగాఁ గొనవలయును. అకున్యాదులచేత "అనుచుక" = ఊహించుచు అని యన్వయము. తృతీయార్థమందు ద్వితీయా ప్రయోగము జడవాచకములకు విహితము (చూ. బాల. కారక. ౨౨.) అయినను, "కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి" - ప్రౌ. వ్యా. కారక. ౧౩. ఉ. "అతని దోర్దర్ధ్యసరసి నోలాడుచున్న ఘనతర స్తనచక్రవాకముల నలరు నంబ నసురేంద్రుకూఁతు రింపారఁ గనియె." హరి. ఉ. ౭. ఆ.-అని యుండుటవలన "కునులక" "కపులక" అను రెంటను, ద్వితీయ సాధువుగా ప్రౌఢవ్యాకరణమతమునం గన్పట్టెడి; కాని-భాషాస్వాభావ్య విరుద్ధంబగుటచే ఈ మతమును, దాననే ఈ పాదమును, అప్రశస్తములు. 'బొమిక' - 'బొమిక నెరకె మ్మెముక యనసెగడు నస్థ్యభిధానము' - ఆం. భా. 'కుని'- స్త్రీలింగము-శ్వానము పుంలింగము, పలలము-"పిశితం తరసంమాంసం పలలం క్రవ్య మామిషమ్"- అమ. 'తోరణము' - "తోరణోఽస్త్రీ బహిర్ద్వారమ్" - అమ. ఇది బహిర్ద్వారవాచకము. వాడుకలో దానికిం గట్టెడు మామిడాకు లోనగువానిం గ్రుచ్చిన (లేక కట్టిన) త్రాటికి పేరై ఆ సాదృశ్యమున చిన్న చిన్న వస్తువులను వ్రేలఁ గ్రుచ్చిన త్రాటికి పేరయినది. ఘాతి - పా. హతి (= దెబ్బ);- "కబ్కశ్ఛద్మద్విజే ఖ్యాతో లోహపృష్ఠకృతాన్తయోః-" మేదిని. "వగచెదురపిల్లె వందురెఁ బల్లటిల్లెఁ। బొక్కనన నంగలార్చె నాఁ బొల్చియుండు" - ఆం. భా. "పరఁగు నాకస్మికంబు డబ్బాటనంగ" - ఆం. భా. "ప్రబలు ముఱుత్రోవ నాఁగ దుర్గంధపదవి" - ఆం. భా.

సీ. మృతమర్త్య రెంటాన నిడ్డఁ జాలక నెత్రు
రంజిల్లు పెనుపొట్ట ముంజివానిఁ,
బల్లచీమల వక్ర భల్లాతకియుఁ బోలె
నెట్టదుప్పటి నొప్పు కట్టెవాని,
వ్యత్యస్త హస్తిమ స్తాభఁ బాయగు గడ్డ
మును దంష్ట్రికలుఁ బొల్చు మొగమువాని
గడుఁదుర్ల నిడు తుట్టెగతిఁ జొఁగ లోఁ బొందు
రత మించు కపిలకూర్చంబువాని,

తే. నెఱకుఁదెలువరిఁ గన శాఖ లెక్కఁ జాఱు
ప్రేవుజందెంబుఁ గసరి పైఁ బెట్టువాని,
వ్రేలు డగుబొజ్జ గల బూర గాలివానిఁ,
జెంబుతలవాని నవటు కచంబువాని. 19

౧౯, ౨౦ పద్యములకు ఒకటే యన్వయము. ఇట్లు ఏకాన్వయముగల రెండుపద్యములను కులక మందురు. (1) మృతమర్త్యున్ = చచ్చిననరుని (నరశవమును), రెంటానన్ = గోఁచిగా, ఇడ్డన్ - పెట్టుకొనఁగా, చాలక = (పొడవు) చాలనందున, నెత్రు = నెత్తురు, రం...నిన్ - రంజిల్లు = ఎఱ్ఱ నగుచున్న - పెను = పెద్ద - బొడ్డు = నూతిగోడవంటి (పాక్కుటితోడి) - ముంజివానిన్ = మొలత్రాడు గలవాఁడును;

(2) పల్ల...యుఁన్ పోలెన్ - పల్లచీమల = పాటలవర్ణముగల పిపీలికలుగల - వక్రభల్లాతకియుఁ బోలెన్ = వంపుగింజల జీడిచెట్టువలె (ముంతమామిడిచెట్టు = మొక్కజీడిచెట్టువలె), ఎఱ్ఱదుప్పటిన్ = రక్తవర్ణమయిన కప్పడముచేత, ఒప్పు - కఱ్ఱివానిన్ = నల్లనివాఁడును;

(3) వ్యత్య...భన్ - వ్యత్యస్త = తలక్రిందు సేయఁబడిన - హాస్తిమస్త = ఏనుఁగుతలయొక్క - ఆభన్ = తీరుతో, పాయ అగుగడ్డమున్ = రెండు పిండములుగా నేర్పడిన చిబుకమును, దంష్ట్రికలున్ = కోఱలును, పొల్చు మొగమువానిన్;

(4) కడుఁదుర్ల నిడు తుట్టె గతిన్ = కడుఁదుఱఁగలయొక్క నిడుద గుమివలె, చొంగ లోన్, పాండురతన్ = శ్వేతపీతవర్ణము, మించన్ = అతిశయించునట్లుగా, కపిలకూర్చంబువానిన్ = గోరోచనవర్ణపు శ్మశ్రువులు (అనఁగా గడ్డమును మీసములును) కలవాఁడును;

ఎఱకన్ = తిండికై, తెరువరిన్ కనన్ = మార్గస్థుఁడు ఎవఁడేని అటువైపు వచ్చుచున్నాఁడేమో కనుంగొనుటకు, శాఖలు = కొమ్మలు, ఎక్కన్, జాఱు ప్రేవు జందెంబున్ = భ్రంశమొందిన ప్రేవుల జన్నిదమును, కసరి = కోపించి, పైన్ = బుజముమీఁద, పెట్టువానిన్ = మరల నుంచుకొనుచున్నవాఁడును, వ్రేలుడు = వ్రేలుచున్నట్టిది, అగు - బొజ్జ = పొట్ట, కల - బూరగాలివానిన్ = శ్లీపదము కలవాఁడును, చెంబుతలవానిన్ = చెంబునాకారపు శిరముకలవాఁడును, అవటు కచంబువానిన్ = పెడతలయందు తలవెండ్రుకలుగలవాఁడును,

తే. కండకన్నులవాని, నాఁకటను బండ
తిట్ల బేతాళికల సారెఁ దిట్టువాని,
నగగరిమవాని, నన్వర్థ నాముఁ గుంభ
జాను వనునొక్కద్విజనిశాచరునిఁ గనియె. 20

కండ కన్నుల వానిన్ = కండలు పెరిఁగిన నేత్రములు గలవాఁడును, ఆఁకటన్ = ఆకఁటి చేత, బేతాళికలన్ = పిశాచికలను, సారెన్ = మాటిమాటికి, బండబూతులన్ = కాఱుఁదిట్లచేత, తిట్టువానిన్ = శపించుచున్నవాఁడును, నగ గరిమ వానిన్ = కొండంత బరువుగల వాఁడును, అన్వర్థ నామున్ = సార్థకనామధేయుఁడును (అయిన), కుంభజానువు = కుండమోఁకాలివాఁడు - అను - ఒక్క - ద్విజనిశాచరునిన్ = బాపనరక్కసుని (బ్రహ్మరాక్షసు ననుట), కనియెన్.

తా.__ఆ దాసరికి ఆ చెట్టుమీఁద నొక బ్రహ్మరాక్షసుఁ డగపడెను. అతఁ డెట్లుండె ననఁగా:__అతఁడు ఒకనరశవమును గోఁచి పెట్టుకొనఁగా అది పొడుగు చాలనందున మొలత్రాటికి

బిగించి తగిలించుటలో దాని నెత్తురు బొడ్డుమీఁదికి బావిగోడవంటి మొలత్రాటిమీఁదు మీఁదికి చిలికియుండెను.—స్వభావోక్తి.

ఆతఁడు తన నల్లని శరీరమును ఎట్టని దుప్పటి కప్పుకొని బాపనచీమలు దట్టముగా పైఁబర్విన వక్రభల్లాతకివలె నుండెను.—ఉపమాలంకారము.

వాని మొగము తలక్రిందు చేసిన యేనుఁగుతలవలె నుండెను; ఎట్లన - పెదవిక్రిందినుండి కంఠము వఱకు లోవపడి రెండుపిండములుగా నున్నగడ్డము ఏనుఁగుయొక్క తలక్రిందైన కుంభములవలెను, నోటినుండి సెలవులకడ క్రిందికి వంగిన నిడుదకోఱలు రెండును తలక్రిందైన యేనుఁగు తలలోని రెండు కోఱలవలెను ఉండెను.—ఉపమాలంకారము.

వ్రేలుగడ్డంబును మీసములును అంతయు ఒకటిగా నిలువుగా పెరిఁగి కణుఁదురుల నిడుద తుట్టెవలె గోరోజనపు వర్ణముగా నుండెను, అందులో చొంగచే మఱుఁగుపడినభాగము కొంత పాటలవర్ణముగాను ఉండెను.—ఉపమాలంకారము.

తనకు ఆహారముకై ఆతఁడు ఎవఁడైన తెరువరి దారి తప్పి తనచెట్టుకడకు వచ్చుచున్నాఁడో కనుంగొనుటకై పైకొమ్మల కెక్కి చూచుత్వరలో వ్రేవుజందెము బుజములనుండి జాఱి పోఁగా, దానిని కోపముతో మరల బుజమున కెక్కించుచుండెను;—స్వభావోక్త్యలంకారము.

అతనికి వ్రేలుబొజ్జ, బూరగాలు, చెంబుతలయు నుండెను. పెడతలయందలి గుంటలో (ముచ్చిలిగుంటలో) కొంచెము జుట్టు మొలచి యుండెను. కన్నులలో కండలు పెరిఁగియుండినవి. ఆతఁడు ఆఁకటిపెల్లున పిశాచికలను మాటిమాటికి కాఱుఁదిట్లు తిట్టుచుండెను. కొండంతబరువు వాఁడు, పేరు కుంభజానుఁడు; పేరికి తగినట్లే మోఁకాళ్లు కుండలవలె నుండెను.—స్వభావోక్తి.

“పాటలాఖ్యలు చెలంగుఁ। బల్ల యనఁ బస్సె యనఁగను బయ్య యనఁగ” ఆం. భా. “కతి కట్ట కాటియు కటియ నల్లన। కప్పఁ కం దనఁగను నొప్పుఁ గృష్ణవర్ణంబు” ఆం. భా. ‘దంష్ట్రికలు’- “దంష్ట్రాకోటివిశఙ్కటాస్యకుహరాః” వాసవ. “కూర్చ స్త్వస్త్రియాం కశే। శ్మశ్రు కైతవపీ తేషు భ్రువోర్మధ్యేవికత్థనే”- నానా.—‘వక్ర’-వక్రత - బొజసాటికొలకు. ‘పాయగు గడ్డముల్’-పా. పాయలగడ్డముల్. ‘పాండురత’-“హరిణః పాణ్డురః పాణ్డుః” అమ. “త్రీణి పీతసంవళితశుక్లస్య” అని అందులటీక-రామాశ్రమీయము. ‘జందెము’ - రూ. జన్నిదము - ప్ర. యజ్ఞోపవీతమ్. “అవటుర్ఘాటా కృకాటికా”-అమ. “బూరకాళ్ వాఁడనఁగ బ్రవృద్ధపాదుఁడు దనరారు.” ఆం. భా.

ఉ. వాఁడును గంటిఁ బోకు మని వ్రాలె మహిన్ విటపాళి నుగ్గుగా,
వీఁడును మున్ను రేపగటి వేళకు మానిసి యౌటఁ, బోరిలో
వాఁడిమిఁ గొంత కాల మిల వ్రాలుట, లావరి యౌట, నిల్చి యా
వాఁడిశరంబుచే నడువ, వాఁ డది ద్రుంపుచు వీఁడు నుద్ధతిన్. 21

వాఁడును=ఆబొమ్మరాకాసియు, కంటిన్ = నిన్ను చూచితిని, పోకుము అని, విటపఆళి = కొమ్మలసమూహము, నుగ్గుగాన్ = చూర్ణమగునట్లుగా (నలిగిపోఁగాననుట), మహిన్ = నేలకు వ్రాలెన్ =దుమికెను: వీఁడును=దాసరియు, మున్ను, రేపగటివేళకున్ =రేయుంబగళ్లకు, మానిసి ఔటన్ =శూరుఁడగుటచేతను, పోరిలోన్ = యుద్ధములో, వాఁడిమిన్ = మగఁటిమితో కొంత కాలము, ఇలన్ =భూమిలో, వ్రాలుటన్ = ప్రసిద్ధిపొందినవాఁడయినందున, లావరి = బల్లిదుఁడు, ఔటన్ =అయినందునను, నిల్చి=పోకకాలూఁది, ఆవాఁడిశరంబుచేన్ = మున్ను చెప్పినపదనుగల

జోడమ్ముతో (చేయమ్ముతో), అడువన్ = రక్కసునిం గొట్టఁగా, వాఁడు = ఆరక్కసుఁడు, అది = ఆజోడమ్మును, త్రుంపుడున్ = ఖండింపఁగా, వీఁడున్ = దాసరియు, ఉద్ధతిన్ = గర్వముతో.- తర్వాతికన్వయము.

"విటపోఽస్త్రీ ద్రువిస్తారే పల్లవే స్తమ్బశాఖయోః"-నానా. మానిసి-"మానిసి మనిసి సామనుజసామాన్యంబు" ఆం. భా.-ప్ర. మానుషః - లక్షణచే పరాక్రమశాలి. వాఁడిశరంబు - కర్మధారయము - స్త్రీసమపూర్వపదము; "కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజవిశేషణ పూర్వపదంబయి యుండు"-బాల. సమ. ౮.

సీ. తిగిచిన నడుగులు దెమలక ఱొమ్మప్ప
ళించి యవ్వలికిఁ జండించి దాఁటి
చఱచిన వంచించి చరమభాగమునకై
తిరిగి, తత్క్రియ కగు దృష్టి నిలిపి
పైఁబడ్డఁ జనుమఱ పట్ల కొడ్డుచునుండు
పిడికిళ్ల బలిమి లోఁబడక నిలిచి
చొరఁజూడ గ్రుంగి ముష్టులబిగి కోటగాఁ
జొరనీక తిరిగెడు చోన తిరిగి
తే. యసుర వధసాధనము రోయు నపుడు గ్రుద్ది
తాచి తిరిగినఁ గృతముష్టి దండ నిలిచి
యొడకొలఁది వెన్క నడ నొయ్య నడిచి యడిచి
మత్పదస్మృతి యాత్మ నేమఱక యతఁడు. 22

(1) తిగిచినన్ = రక్కసుఁడు తన్ను లాగఁగా, అడుగులు తనపాదములను, తెమలక = ఉన్నచోటినుండి కదలనీక, ఱొమ్ము=రక్కసునివక్షమును, అప్పళించి=ఆస్ఫాలనముచేసి (చఱచి), అవ్వలికిన్ = అవతలికి, చండించి = తొలఁగి (పా. కేడించి) దాఁటి = లంఘించి (కర్త దాసరి); (2) చఱచినన్=రక్కసుఁడు తన్నుఁ గొట్టఁగా, వంచించి = ఆ దెబ్బను ఉపాయవిశేషముచేతను తప్పించుకొని, చరమభాగమునకై = వాని వెన్నువైపు, తిరిగి, తత్క్రియకున్ = వాని చేఁతకు, అగుదృష్టిన్ = వలసినచూపును, నిలిపి = వానివైపు ఉంచి (కర్త దాసరి); (3) పైన్=తనమీఁద, పడ్డన్=రక్కసుఁడు పడఁగా, చనుమఱపట్లకున్=వాని చనునలుపు లుండెడు తావులకు, ఒడ్డుచునుండు పిడికిళ్లబలిమిన్ = గుఱి పెట్టుచున్నట్టి తనముష్టుల బలముచేత, లోఁబడక = రక్కసునికి లోఁగక, నిలిచి (కర్త దాసరి); (4) చొరఁజూడన్ = రక్కసుఁడు తన ఱొమ్ముమీఁదికి చొచ్చుటకు ఉంకింపఁగా, గ్రుంగి = తాను క్రిందికి తగ్గి, ముష్టులబిగి = తనపిడికిళ్ల బిగువు, కోటగాన్ = తనకు ప్రాకారముగా (పరిమాణాలంకారము), చొరనీక=వానిని తనఱొమ్ముమీఁదికి రానీక, (పా. చొరవీక = చొరవ ఇయ్యక,) తిరిగెడు చోన = వాఁడు ఎటు తిరిగిన నటెల్ల, తిరిగి (కర్త దాసరి);

అసుర=రక్కసుఁడు, వధసాధనము=చంపుటకు ఏదేనొక పోటుముట్టు (రాయి గాని రప్ప గాని), రోయునప్పుడు = వెదకు సమయమందు, గ్రుద్ది = వానిని పిడికిటితో కొట్టి, తాచి = తన్ని,

తిరిగినన్=వాఁడు వెనుకకు తిరుగఁగానే, కృతముష్టిన్=అమర్చుకొన్న పిడికిటితో (పిడికిలి బిగియఁ బట్టుకొని), దండన్=సమీపమున, నిలిచి, ఎడకొలఁది=దొరకిన సందునకు తగినట్టు, వెన్కనడన్= వెనుక నడకచేత, (పా. వెనుక నడుము - వెనుకన్ = వీపును, నడుము=మధ్యమును), ఒయ్యన్ = వారక, అడిచి=కొట్టి, నడిచి, మత్పదస్మృతిన్ =నాపాదముల ధ్యానమును, అత్మన్ = మనస్సులో, ఏమఱక=మఱచిపోక, (అతఁడు=ఆ దాసరి). (అవలి కన్వయము).

తే. తాఁచి పోఁజూడఁ దనరాక్షసీచయంబు
నెల్లఁ జీరిన డిగ్గి వా రేఁగుదేరఁ,
బోయె నదె వాఁడు రారె రారే యటంచుఁ
బాఱి వారును దానును బట్టికొనుఁడు. 23

తాఁచి = తన్ని, పోఁజూడన్ = నిర్గమింప నుంకింపఁగా (కర్త దాసరి), తన రాక్షసీచయంబున్ ఎల్లన్ = (రక్కసుఁడు), తనరాక్షసీ సమూహము నంతయు, చీరినన్ = పిలువఁగా, వారు, డిగ్గి=చెట్టు దిగి, ఏఁగుదేరన్ = రాఁగా, అదె వాఁడు పోయెన్ రారె రారే అటంచున్= (ఇది రక్కసుని వాక్యము) ఓ మగువలారా ఆ దాసరి పోయినాఁడు రండే రండే అని, పాఱి= పరువెత్తి, తానును వారును పట్టికొనుడున్=పట్టుకోఁగా (కర్త దాసరి).

అప్పళించు - వై. ఆస్ఫాలించు తత్సమ.—"పృష్ఠం తు చరమం తనోః" - అమ. అసుర- రూ. అసురుఁడు.—తాఁచి పోఁజూడఁ దన రాక్షసీచయంబు - చఁచప్రాసము. అప్పకవి దీనిని ఒప్పి వరాహమునుండి యుదాహరణము నిచ్చినాఁడు.

క. బంబో తద్దాసరి య। ప్డుం బదహతులను గపోణి పోటుల నిరుమై
లం బొడుచుచుఁ బెనఁగుచుఁ బో। వం, బట్టి వటంబుఁ జేర్చి వాఁ డిట్లనియెన్.

బంబోతు=బలిసినవాఁడైన, అద్దాసరి, అడ్డున్ = అట్లురక్కసుఁడు పట్టుకొన్నను, పదహతు లను = కాళ్లతాఁపులచేతను, కపోణి పోటులన్ = మోఁచేతుల (తో) పొడుచుటలచేతను, ఇరు మైలన్=రెండు ప్రక్కలను, పొడుచుచున్, పెనఁగుచున్=పోరుచు, పోవన్=పోవుచుండఁగా, పట్టి వటంబు చేర్చి, వాఁడు=ఆ రక్కసుఁడు, ఇట్లనియెన్.

తా.—ఆ రీతిని వారు పట్టుకొన్నను ఆ దాసరి బలీయుఁ డగుటచేత ఆ రక్కసుని కాళ్లతో తన్నుచు మోఁచేతులతో వానియొడలిని రెండుప్రక్కలను పొడుచుచు, పెనఁగులాడుచు పోవు చుండెను. అయినను రక్కసుఁడు అతనిం బట్టితెచ్చి యిట్లనియె.

"బంబోతు నా నెద్దువలెను మిక్కిలి యొడ। ల్బలిసి యుండెడివాఁడు పరఁగుచుండు" - ఆం. భా. "కపోణి స్తు కూర్పరః" - అమ. 'పెంబోతు' అనుపాఠమున పెను×పోతు - పెద్ద పోతు - బలిసినవాఁడు అని యర్థము.

శా. సారాస్వాదనఁ బ్రాణపంచకము తృష్ణం బాసి సంతర్పణ
న్మూరింబో నసిఁ ద్రుంచి పొంగెడు భవ న్మండంబు ధారోష్ణ మిం
పారం గ్రోలి, పిశాచి నీదు కఱకు ట్లిందీ, నదస్త్రాల కాం
తారాంత ర్నృకపాల కుండ విగళ న్మైరేయముం ద్రాగెదన్. 25

సార ఆ స్వాదనన్ = శ్రేష్ఠమయిన రుచిచేత, తృష్ణన్ = దప్పిని, పాసి=తీర్చుకొని, సంత ర్పణన్=తనియించుటచేత, ప్రాణ పంచకము=పంచప్రాణములును, మూరిన్ పోన్=విజృంభించు

నట్లుగా, (అతిశయించునట్లుగా), పొంగెడు భవత్ ముండంబున్ = గర్వమెక్కియున్న నీ తల
కాయను, అసిన్ = కత్తితో, త్రెంచి = నఱికి, ధారా ఉష్ణము = వేఁడి యూఱని (నీ మొండెంపు)
నెత్తుటిని, ఇంపు అరన్ = ప్రీతి యొప్పునట్లుగా, క్రోలి = త్రాగినవాఁడనై, పిశాచి = నా భార్య
యయిన దయ్యపుసాని, నీదు కఱకుట్లు = కఱ్ఱుకుఁగాని (కఱ్ఱునకుఁగాని) గ్రుచ్చి నిప్పులమీఁద త్రిప్పుచు
పచనముచేయు నీ మాంసములు, అంది ఈన్ = నాకు అందింపఁగా, అద...మున్ - అదః = ఈ - తాల
కాంతార = తాటిచెట్ల తోపుయొక్క - అంతః = లోపలి - నృకపాల = మానిసిపుఱ్ఱెల నెడి - కుండ =
లొట్టులయందు - విగళత్ = ఓడుచున్న - మైరేయమున్ = కల్లును, త్రాగెదన్ = పానము చేసెదను.

తా.— పొగరెక్కిన నీతలకాయను కత్తితో మెడనుండి నఱికివైచి నీబొందుగనుండి దుమి
కెడు నీ మొండెంపు రక్తమును వేఁడియూఱనీకయే, దప్పితీఱ పంచప్రాణములును దనియునట్లుగా,
బలేరుచితో త్రాగెదను. అంతట నీమాంసములను కఱుకుట్లుగా వండి నాభార్యపిశాచి నాకు తెచ్చి
యిచ్చును, అంతట వానిని నంజుకొనుచు ఇదె యీ తాటితోఁపులో దుత్తలుగా కట్టియున్న మానిసి
పునుకలలోనికి ఓడుచున్న తాటికల్లును త్రాగెదను. నృకపాలకుండ-పరిణామాలంకారము.

'మైరేయము'-చూ. పట్టిక.— 'సారో బలే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబే వరే త్రిషు' అమ.
'ఆస్వాదనమ్'=ఆస్వాదః - "ఆస్వాదవద్భిః కబళై స్తృణానామ్"-రఘు 2 (5). "ఆస్వాదవద్భిః
స్వాదుయుక్తై రిత్యర్థః"-మల్లి. టీక. 'ప్రాణపంచకము.'—"ప్రాణోపాన స్సమాన శ్చోదానవ్యానౌ
చ వాయవః, హృది ప్రాణో గుదేఽపాన స్సమానో నాభిసంస్థితః ఉదానః కణ్ఠదేశస్థో వ్యాన స్సర్వ
శరీరగః" అమ. "పఞ్చప్రాణమనోబుద్ధిదశేన్ద్రియ సమన్వితమ్। అపఞ్చీకృతభూతోత్థమ్ సూక్ష్మా
ఙ్గం భోగసాధనమ్" ఆత్మభోధ. మూరింబోన్ - దీనికి అతిశయించు, వర్ధిల్లు, విజృంభించు, సఫల
మగు, నశించు అనునర్థములు సప్రయోగములుగా శ. ర. మందు ఉన్నవి. "తనయబంధుకళత్ర
మిత్రములమీఁద మూరిఁబోవంగఁ బ్రాఁకినమోహలతను" శృం. శాకుం. 4 ఆ. "దేవోత్తం
సుఁడు భక్తవత్సలుఁడు చిత్తేజః స్వభావుండు గా। రీవామాంగుఁడు శంకరుండు దయమూరింబోవఁ
గంగేలునన్। జావన్వచ్చినపుర్వుఁబట్టి తగు నీసద్భక్తికిన్ మెచ్చితిన్। నీ వే యర్థము నన్ను వేఁడె
దవు దానిం జెప్పుమా నావుడున్." శ్రీకాళ. మా.

వీని నెల్లం బరికింపఁగా "సంతోషించు" అను నర్థము కనఁబడలేదు, "అతిశయించు" అను
నర్థము పొసఁగుచున్నది. - కఱకుట్లు - "గనగన నిప్పులం జమురుచిప్పిలం గాల్చిన కమ్మకఱ
కుట్లన్" - మను. ౪ (౬) - ఇందులకు "...కాల్చిన = ఇనుపశలాకలకు గ్రుచ్చి వ్రేలఁబట్టి పక్వ
ముగాఁ గాల్చిన - కమ్మ = సంబారు చేర్చుటచేఁ బరిమళించుచున్న - కఱకుట్లన్ = శూల్యములతో -
కఱ్ఱుతోఁ గుట్టిన మాంసఖండంబులతో - ('కఱుకుట్లు' - 'కఱ్ఱుకుట్లు' - 'కఱకుట్లు' - 'కఱ్ఱకుట్లు' -
అనియును వీనిని వాడుదురు.) అని జూలూరి యప్పయ్య పంతుల టీక. అందీన్ - ఇది శబ్దపల్లవము.
సంధికి పీఠికం జూచునది. వాఙ్మయమందు ఈ శబ్దపల్లవము నూర్లకొలఁది దొరకియున్నది. శబ్దపల్ల
వము కాని క్త్వార్థేకారసంధికి పదునెనిమిది పర్వముల మహాభారతములో "ఎఱిఁగించిపుడే" అను
నొకటే ప్రయోగము దొరకుట క్త్వార్థేకారసంధి ప్రియుల ప్రభావంబునం గాదేని యాశ్చర్యము
గాదా. ఈ పద్యము మాకు లభించిన ముద్రణంబున "ఇతఁడు మదీయాగ్రపురో। హితుఁ డితనికి నెల్ల
తెఱఁగు లెఱిఁగించి తగన్। ధృతరాష్ట్రుకడకుఁ బనుపుఁడు చతురవచనరచన గలిపి సంప్రీతి
మెయిన్," అని యున్నది.

